రమణీసీతను జూచి రాముఁ డుప్పొంగె
అమితసమ్మోదమ్ము నందిరి ప్రజలు.

అలరారె నవనిజ కంతకంతకను
పొలుపగు చెక్కిళుల్ తెలతెల్ల నగుచు
నడలు మందములయ్యె బడలిక హెచ్చె
నడుము భారమ్మయ్యె సడలె ధైర్యమ్ము.
వదలక రాముని వద్దనే యుండ
మది నిచ్చగించు నా మానిని సీత
తీరని మమతతో సారె సారెకును
కోరిక లేవేవా కోరుచునుండు.
వెనుక తానొకనాఁడు వెడలినవనులు
మునితపోవాటికల్ మునిపత్ను లెల్ల
కనులలో కదలిన ట్లనిపించి మరల
కనుఁగొన నెంచి యా మునివనుల్ సీత
వేగమ్మ తనవాంఛ విభునకుఁ జెప్పె
ఔఁగాక యని రాముఁ డల్లన నవ్వె.

ఒకవిరాగము తన యుల్లమ్మునందు
ప్రకటమైన విధమ్ము పైకిరానీక
సీతను ప్రేమతోఁ జేరి రాఘవుఁడు
ప్రీతితో మాట్లాడి ప్రీతితోఁ జూచు

శ్రీరాము నాత్మలో చెలరేగుచున్న
వైరాగ్య మింతైన ధారుణీజాత
యెఱుఁగంగలేక తా నెప్పటియట్లె
తిరుగుచునుండె నే యరమరిక లేక.

---

## శ్రీరాముఁడు సీతను త్యజించుట

కడుసంతసమ్మాయి కాల మీరీతి
పుడమిపై వారికి గడచుచు నుండె.

లోకులు కాకులు లేతేఁకువ లేక
వాకొంద్రు నోటికి వచ్చిన యట్లు.
పరవాసమం దొకవత్సర మున్న
తరుణి సీతనుఁదెచ్చి మరల శ్రీరాముఁ
డేలుచున్నాఁ డంచు నెచటనో యెవఁడో
యాలోచనము లేక అనినట్టి మాట
వినవచ్చె రాముని వీనులయందు
సునిశితశూలముల్ జొనిపిన యట్లు.
జనకజ దూకిన జ్వాలదగ్నిశిఖలు
తనకన్నులందుండి తరలనే లేదు.
సీత పాతివ్రత్యశీలమ్ము నెల్ల
వీతిహోత్రుఁ డెఱుంగు విశ్వమెఱుంగు

కాని లోకులు పల్కు కానివాక్యముల
నూరక వినుచు తా నుల్లమ్ము నందు
సైరింపఁ జాలఁడు క్షణము రాఘుండు,
తానె యట్లున్నచో ధర్మ మేమగును;
తానె యట్లున్నచో ధరణి యేమగును ?
ఎడదయందలి ప్రేమనెల్ల నణంచి
తడయక తన రాజధర్మమ్ము నెంచి
జనులాడు నపనింద సైరింపలేక
తనసీత నెడబాయఁ దలఁచె రాఘవుఁడు.

మోమున నొకచింత బ్రామికొనంగ
సౌమిత్రి కెఱిఁగించి జరిగిన దెల్ల
అడవిలో వాల్మీకి యాశ్రమస్థలిని
కడువడి సీతను విడచిరమ్మనుచు
వాదమ్మునకు తావు వదల కావంత
ఏమిది ఏమిది యెంత ఘోరమ్ము
భూమిజన్ త్యజియింప రాముఁడు తలఁచె.
రాముఁడే పలికెనా యీమాట లెల్ల
సౌమిత్రి కుదయించె సందియ మ్మదో.
రామునియాజ్ఞలో రగులు తీవ్రతకు
సౌమిత్రి నిలువున చలియించిపోయె.
పిడుగులు తలమీఁద పడుచున్నరీతి

నెపదలో లక్ష్మణుం బంపెను గాని
రామునిమాటకు రాగూడ దడ్డు
రామాజ్ఞ మీఱగా రాదు ధారుణిని.
మఱునాఁడె లక్ష్మణుం డరదమ్ము దెచ్చె
నడుగగా నడవుల కవనిజం గొనుచు.
తనకోర్కె రాముఁడు విని తీర్చె ననుచు
జనకజ యుప్పొంగి సంతోష మమర
వనికేగ వెంటనే బయలుదేరినది
వెనుకకు దినములో చనుదెంచు ననుచు.
ఆమెకు చేయూతనందిచ్చి పంప
రాముడు బయటకు రాడేల యనుచు
తోడనే యొకబాధ తోచె జానకికి
చూడినట్లయిగుండె శూలమ్ము గ్రుచ్చె.
వడితోడ హయములు పరువెత్త రథము
కడుదూర మింతలో గడచిపోయినది.
ఏచక్కి జనకజ చూచినప్పటికి
తోచెను విపరీత దుర్నిమిత్తములె.
చాటునఁ గూర్చుండి చనుదెంచుఁ గాని
మాటాడఁ డేమియు మఱిది లక్ష్మణుఁడు
ఎందుల కీకోర్కె యెడ నుద్భవించె
ఎందుల కీవని కేతెంచె తాను
తట్టుకోజాలని తపనతో నిండి

కొట్టుకోసాగెను గుండె జానకికి.
అడవిదారులఁ బట్టి నడచి మూరథము
కడువేగ చేరెను గాంగతీరమ్ము.
దిగె లక్ష్మణుండును దిగెను మాతలియు
దిగి ఏఁదో తెలియని దిగులుతో సీత
"ఏమయ్య లక్ష్మణ! ఏమైన దోయి
ఏమి దీనుఁడవయి యిట్లుంటి" వనియె
విరిగిపడ్డది మిన్ను శిరమున నంచు
తెలియఁగదు పాప మాయింతి సీతమ్మ
చెప్పకపోలేక చెప్పఁగా లేక
తప్పించుకోలేక తలమీఁది బరువు
వదనమెత్తఁగ లేక వాల్చి లక్ష్మణుఁడు
వదినకాళ్ళకు మ్రొక్కి వచియించె నిట్లు.

"ఓయమ్మ జానకి! ఓ మహాసాధ్వి!
నాయందు దయఁబూని నన్ను క్షమింపు,
శ్రీరామునాజ్ఞను మీఱఁగా లేక
భారమౌచును నాదు స్వాంతమం దెఱఁగి
కొనివచ్చితిని నిన్ను వనవీథి కిటుల
వినిపింపఁగా నొక్క వెసిదంపు వార్త.
పరవాసమందున్న పడతి జానకిని
మరల రాముండేలె ధరణి నటన్న

పరు లాడుచున్నట్టి పరుషవాక్యములు
భరియింపఁగాలేక పరితాపమంది
రాముఁడు వేగమె రమణిరో! నిన్ను
నీమహాటవిలోన నేకాకి గాఁగ
విడచిర మ్మనఁగ నిన్నడవి కీర్తి
తదయుక తెచ్చిన కడుపాపి నేను,
ఈకానన మ్మెడ సాకేత మేడ
ఏకాకివై యిచ్చ టెటులుందువమ్మ !
ఎవరు సఖీజను లెవరు బాంధవులు ?
ఎవరు దిక్కిచట నీవెట్లు వేగెదవో
పరనింద పడలేక వదలెనే కాని
యెఱుఁగఁడే శ్రీరాముఁ డెదలోన నిన్ను,
దారుణారణ్యమే తల్లి! నీయిల్లు
కూరిమి చుట్టాలు క్రూరజంతువులె
అనియేమొ లక్ష్మణుం డనెడువాక్యములు
వినలేక జనకజ విస్మృతిం గొనియె.
ప్రేలినవా వేయిపిడుగులు తలను!
వ్రీలినదా క్రింది పృథ్వీతలమ్ము!
తలగొట్టినట్లయి తాలిమి తూలి
నెలలు నిండిన తల్లి నిండుచూలాలు
"నాతల్లి భూదేవి ననుగావు మనుచు

భూతలమ్మునఁ బడి సీత మూర్ఛిల్లె
తెలివొంది లక్ష్మణుం బిలిచి దీనముగ
మెలమెల్ల నిట్లని పలికె జానకియు
కనులందు నశ్రువుల్ కాల్వలై పార
తనువెల్ల వణఁకుచు దడదడ లాడఁగ.

"వినవయ్య లక్ష్మణ! వినవయ్య తండ్రి
పనివడి నాకేమి వసుధపై మిగిలె,
నా రాముఁడే యిట్లు నన్నుఁ ద్యజింప
ధారుణి నన్నింకఁ దలఁచువారెవరు ?
విడలేక రాముని వెన్నంటి యేగి
అడవులఁ దిరిగితి నగ్ని దూకితిని
చాలవు గాబోలు జగతి నీపాట్లు
తలింతు రెవరింక పాలింతు రెవరు.
నావిధి యిట్టులుండ నీ వేల తడయ
వేవేగ లక్ష్మణా వెనుకకు బొమ్ము
అడవిలో సీతను విడచి నాననుము
నుడువుమెల్లరకు నాకొకసారి మాట—
బత్తితో రామునే ప్రార్థింతు ననుము
అత్తల ముగ్గుర నడిగితి ననుము
మునిపత్నులకును మ్రొక్కితి ననుము
మన బంధువులకెల్ల మఱువకే ననుము

తలపున రామునే నిలిపెద ననుచు
ఇలనెల్ల దయతోడ నేలుకొమ్మనుచు
రారాజు జనకుని గారాముతనయ
కూరిమికోడలు కోసలేంద్రునికి
భూపుత్రి శ్రీరామభూపాలు పత్ని
ఏపాప మెఱుఁగని యింతి యీసీత
దీనురాలై యిట్లు దిక్కులేకుండ
కానలయందున కలసిన దనుచు"
పలుకుచు తనలోని తలఁపుల నిట్లు
విలపించి విలపించి విలపించలేక
దరిలేని శోకాన ధరణిజ పొగిలి
మఱుమాట లేకుండ మరల మూర్ఛిల్లె.
భూవలయమ్మెల్ల పూజింపఁ దగిన
దైవస్వరూపిణి ధరణిమూర్ఛిల్లె,
క్షితిమీఁద నింక నీ సీతాలతాంగి
బ్రతికియుండిన మాట ప్రాణాలతోడ.
పాప మాకడుపులో పసికందు వెట్లు
నైపుచుండెనో యీమె సంతాపబాధ,
తలఁచినకొలఁది నాతల్లి దుస్థితిని
నిలువున తనగుండె నీరయి పోయి
ఏమి మాటాడుటో ఏమి చేయుటయొ
సౌమిత్రి యెఱుఁగక చలితచిత్తమున

కన్నీళ్ళు ప్రవహింప కాళ్ళవంక
క్రన్నన జానకి కాళ్ళకు మ్రొక్కి,
"కానవే నాతల్లి జానకి నిచట
కానసమ్ముల డించి నేనేగుచుంటి,
పంచభూతములార పక్షీంద్రులార
అంచితోరగులార అర్కేందులార
తరులార గిరులార తారకలార
వర మునీశ్వరులార వాహినులార
దేవతాతతులార దిక్పతులార
కావవే సీతను కరుణతో ననుచు
విడలేక సీత నావిపినమధ్యమున
విడనాడి దీనుఁడై వెడలె లక్ష్మణుఁడు.

ఊరికి మఱునాఁడె యొంటిగా వచ్చి
ద్వారమ్ముకడ నున్న తమ్మునిఁ జూచి
చూచెను రాముఁడు శూన్యమౌ రథము.
ఏదో నేబాధయో యాచిత్తమందు,
ఎండిన కనుదోయినుండి రామునకు
రెండశ్రువులు జాలి పృథివిపైఁ బడియె
తన బహిఃప్రాణమ్ము ధరణిజ లేని
తను వేల బ్రతుకేల ధారుణి యేల.

జీవిత మ్మొకశూన్యసీమయై తోచ
భావమందున రామభద్రున కపుడు.

సీత లేదను వార్త శీఘ్రమ్ము ప్రాకి
చేతమ్ము లెల్లను చెరువులై పోయి
ఘోరున నేడ్చిరి వారింప రాక
పౌరులు బంధువుల్ పరివార మెల్ల.

---

## సీతా పరితాపము

అవనిజ శోకమ్ము నరయంగ లేక
అవని జీవమ్ము సర్వ మాగినట్లయ్యె
తరువులు తలవాల్చె గిరులు చెమర్చె
పరువులెత్తవు లేచి పక్షి.సంతతులు
క్రూరమృగమ్ములు గుహలందె నిలిచె
పారదు గంగాప్రవాహమ్ము కదలి.

లేదు లక్ష్మణుఁ డట లేదు రథమ్ము
ప్రోడయి మిగిలెను భూమిజ యొకతె.
విలపించినను గూడ వినువారు లేరు
పలుకువారును లేరు పిలిచినప్పటికి.
అంతయు శూన్యమా యవనిజ కపుడు

వాత్సల్యమునఁ బల్కె వాల్మీకి యిట్లు
"వత్సరో ! వినుము నేవాల్మీకిమునిని
ఎఱుఁగుదు నీకథ జరిగిన దెల్ల
వెఱఁగంది నీవిట్లు విలపింప కమ్మ !
రాముఁ డెఱుంగఁడే నీమాన్య చరిత
భూమిపై నపనిందఁ బొందగా లేక
వనవాటికలకు నిన్ననిపెనే గాని
మనసు నీమీఁదనే మసలు నాతనికి
పరమపవిత్ర మీవాహినీతటిని
అరయు మర్యాదియె నాయాశ్రమస్థలము
చల్లనినీడలఁ జపతపోవ్రతము
లుల్లాస మొసఁగు నీయుల్లమ్మునందు.
మునిపత్ను లున్నారు మునిసతుల్ కలరు
మనమున సందియ మందకుమమ్మ.
అకలంకమర్యాద లమరి యెల్లపుడు
సకలోపచారముల్ జరుగు నీకిచట
ననుఁగూడ మీతండ్రి జనకునివలెనె
మనమున భావించి మాలోడ వేగ
అరుదేర మమ్మ నీ వెఱపును మాని
జరుగును శుభము లాస్థలమందు నీకు
ననుచు నామౌని తనయాశ్రమమ్మునకు
గొనిపోయె సీతను కూర్మి మీఱంగ.

సీత కా యాశ్రమపు సీమ వేగగనె
చేతమ్ము నందున చేకూరె శాంతి
జనకజ కేలోటు కనగాని రీతి
మునిసతుల్ పరిచర్య లొనరించుచుండ్రి.

---

## లవకుశుల జననము

రామునే మనమున వేమారుఁ దలఁచి
రామునే పూజించు భూమిజ సతము.
ముని యాశ్రమమునకు చనుదెంచు నాది
జనకజ చరియించు మునికాంతవలెనె
రవికుల దైవమ్ము రంగనాథునికి
ప్రవిమలభక్తితో ప్రార్థనల్ సలుపు
మెలమెల్లగా గాంగజలములఁ దెచ్చి
చెలువారు పూవులచెట్లకుఁ బోయు
ప్రీతితోఁ బిలుచును శుకశారికలను
లేతపచ్చిక లేరి లేళ్ళకు మేపు
ఆనందమై పొల్చు నంతకంతకును
జానకి కాశ్రమస్థల జీవనమ్ము
జానకి కొకరాత్రిసమయమ్మునందు
కానుపునొప్పులు క్రమముగా వచ్చి

నభమున గ్రహరాశి విభవమ్ము లలర
శుభ రాశులందుండి శోభిల్లుచుండ
ఇనకులోద్ధారకు లిరువురు సుతులు
జనియించి రామెంతొ సౌందర్యనిధులు.
రామునిం బోలిన రమణీయసుతుల
సామోదమునఁ జూచి యవనిజ యలరె.
మునిరాజు వాల్మీకి చనుదెంచి వేగ
ఘన యశోబలములు కలుగుగా ననుచు
కుశలవమ్ములతోడ కూర్మి దీవించి
కుశలవులను పేర్లు శిశువుల కిడియె.
రవిచంద్ర తేజులు రమణీయతనులు
ప్రవిమలాకారు లా బాలు రిద్దఱిని
మురిసిపోయిరి చూచి మునిపత్ను లెల్ల
అరుదెంచి దీవించి రాశ్రమ మునులు

---

## లవకుశుల బాల్యము

సీతమ్మ కథల నా శిశువులే యిపుడు
సీతమ్మ బ్రతుకెల్ల శిశువులే భువిని.
ప్రీతిగా కంటికి ఱెప్పలవోలె
సీతమ్మ పెంచె నా శిశువులఁ జూచి.

మునివాటి కొక క్రొత్త మెరుపు దీపింప
మునిబాలకులతోడ చనవుగా కలసి
మునికుల మంతకు మోదమ్ము గూర్చి
దినదిన వృద్ధిగా తేజమ్మొసంగి
సురుచిర సద్గుణ సుందరు లగుచు
పెరిగి యాబాలురు పెద్దవా రైరి.

లవకుశు లిద్దఱున్ లలితధీయుతులు
ప్రవిమలభక్తితో వాల్మీకి వద్ద
పలుశాస్త్రముల నేర్చి పండితు లైరి.
విలువిద్య గడియించి వీరులైనారు
గానవిద్యల గొప్పగాయకు లైరి.
వీణెలం గొని వారు గానమ్మొనర్ప
మేనులు పులకించు తేనెలే కురియు,
మానిత నవకళామాధుర్య మొలుకు.
తన కనుపండువై జనియించి యిలను
ముని తపోవనులందు ముద్దుగా పెరిగి,
వీరులు ధీరులు విమలసద్గుణులు
శ్రీరాముని యశమ్ము క్షితిమీద నిలుపు
మహితవర్తను లని మన్నన లంది
బహువిధప్రజ్ఞులై వరలుచు నున్న
సురుచిరమూర్తు లాసుతులనుం జూచి

మురిసిపోవును సీత; మునుసుమనమ్మో
దారమైతి నటంచు శ్రీరాముడుండి
భోరున కన్నీటిధారలు గార్చు.

---

## వాల్మీకి రామాయణము వ్రాసి కుశలవులచే గానము చేయించుట

"నీ వాడినవి యయియు నగరింప"వనుచు
దీవించె నాబ్రహ్మ దేవుండు మున్ను,
సకలసద్గుణరాశి జగతి రాముండె
అకలంకవర్తనుం డనియె నారదుండు.
ఆరివాక్యమ్ములే వాల్మీకి మదిని
సారెసారెకు నిల్చె సదుపదేశముగ
చెలువుగ రాముని లలితవిగ్రహమె
నిలిచినట్లుగదోచె నేత్రమ్ములందు.
కనినది వినినది మనమున తాను
తనతపశ్శక్తిచే తనరి చూచినది
జానకీరాముల సచ్చరిత్రమ్ము
పూని రచించెను మౌని వాల్మీకి
సూరిజనామోద సుశ్లోక ఫణితి
శ్రీరమ్య వాక్సుధా ధారలింపార.

ధారుణి వ్యాపించి ధరణివాసులకు
శ్రీరాము చరితమ్ము శ్రోత్రమ్ముఁ సోక్క
అపురూప మైనట్టి యారామకథను
నిపుణత మీఱఁగా నేర్పె వాల్మీకి
గానగంధర్వులు కమనీయ కవులు
జానకీసుతులను చక్క సిరితి.

రమణీయ చరిత మా రామాయణమును
కమనీయ సంగీత కల్పనాగతుల
వినిపింప కుశలవుల్ విమలకంఠముల
వనమెల్ల నటవికే వచ్చి నట్లుండు
మునిజనుల మెల్లను వినఁగను మోదమున
వినను సీతయు వచ్చి కనులు చెమర్ప,
విన నెల్లతరువులు గిరులు విప్పార
వినను మృగమ్ములు వీనుల నెత్తి,
మలయసమీరుఁడా మధురగానముల
మెలమెల్లఁ గొనిపోయి యిలనెల్ల నింపు
అనుపమ మహనీయ మహాదివ్యచరిత
వినినదానినె జనుల్ వినుచుండ్రు మరల.

జానకీరాముల చారిత్రమహిమ
మహిని వాల్మీకుల మధురవాగ్గరిమ
బాలుర మృదుగళ స్వనములో గలసి

పూలతేనియలయి జాలువారినవి
చలువవెన్నెలలయి జగమునిండినవి
ఇలయెల్ల శ్రీరామునిలయమ్మై వెలసె.

---

## శ్రీ రా ము ని  ని ర్వే ద ము

జనకజన్ వీడిన సమయమ్మునుండి
మనమున రాముని కనవరతమ్ము
జానకిరూపమ్మె కానంగ వచ్చు
జానకినిందనే చరియించు తలఁపు.
నెలలు తొమ్మిదియును నిండిన యబల
పలురాళ్ళపై నామె పడియున్నయపుడు
ఆ సీతగొంతులో నవని నేరైన
పోసినప్పటి మాట పుడిసెడు నీళ్ళు.
కోమలహృదయ ఆ కుసుమాంగి సీత
యేమని తలఁచెనో రామునిఁగూర్చి
ఆవేళ తనవెంట నరుదెంచె నంతె
పోవఁగా లేదామె పుట్టింటి కెపుడు
జానకి యేదని జనక రా జడుగ
తానేమి వచియించి తప్పుకోఁ గలఁడు.

రాచకార్యము లెట్లొ రయమునఁ దీర్చి
యోచించు శ్రీరాముఁ డొంటిగా నిల్చి

తనహృదయేశ్వరి తనప్రేమరాశి
తనబహిఃప్రాణమ్ము తనసీత యిపుడు
తననుండి దూరమై చనుచున్న యటుల
మనమందుఁ దోఁచి నట్లనిపించి తనకు
నిలుచున్నచోఁ డిక్కై నిలుచుండిపోవు
పలుకఁ డెవ్వరితోడ బిలువఁ డెవ్వరిని.

## శ్రీరాముఁడు సోదరులకు రాజనీతి బోధించుట

రాయిడి నొందెడి రాము నెమ్మొగము
పోయి చూడఁగలేక ముగురు తమ్ములును
జానకి పాల్పెట్టు సమయమునో యనుచు
దీనులై మనముల దిగులు నొందెదరు.
మనమున శాంతికో మఱి యేమి కతమొ
వినుఁడంచు తమ్ములన్ బ్రీతితోఁ బిలిచి
శ్రీరాముఁ డపుడిట్లు చెప్పుచు నుండు
నే రాజగాథనో యే నీతి కథనో.
రాజు లేరీతిగా భూజనమ్ములను
రాజధర్మమ్మున రక్షింపవలెనో;
ఈయుర్విపాలన మెట్లుండవలెనో

న్యాయనిర్ణయ మెట్లు చేయంగవలెనో
ఆదరమ్మిత్రపాళ నాగ్రహమ్మెపుడు
మేదినీపతి చూప మెలఁగంగవలెనో;
తమ్ములకును రాజ్యతంత్రశాస్త్ర మెల్ల
నిమ్ముగా బోధించె నెట్లు రాఘవుఁడు.

## శత్రుఘ్నుఁడు లవణాసురుని సంహరించుట

వినవచ్చె నింతలో విపరీత మగుచు
దనుజులబాధలు ధరణిని మరల
మధురాపురికి రాజు మధుదైత్యసుతుఁడు
పృథివి కంతకు పెద్దబెడదగా ప్రబలి
లవణాసురుం డొకఁ డపనిష్ఠుఁ దిరుగు
భువిని తానొక్కఁడే మొనగాఁడ ననుచు
రావణు మేనల్లుఁ డావీరుఁ డెపుడ
గావరమ్మునఁగిన కడుదుష్టుఁ డతఁడు
మునులు వచించి రాఘవానుజుని వేగ
దునుమాడుమీ భూమి కనుకూల మనుచు
తనతండ్రి జీవించు దినములనుండి
తనగృహమ్మందున తనరు చున్నట్టి

శివుని శూల మ్మొండు చేబూని లవణుఁ
డవని నజేయుఁడై యనిసేయుచుండు.
ఇనకుల తిలకు నాయనుపమబలుని
దానిచె మాంధాత నాదుష్టుఁడై త్యంచె.

లవణుని దుర్మార్గ లక్షణమ్ముల
చెవియొగ్గి యాలించి శ్రీరాముఁ డంత
అనుపమ యోధుఁడు తనపిన్నతమ్ము
ననిపె శత్రుఘ్ను నాదనుజునిఁ ద్రుంప.
సమధికవీరుఁ డాశత్రుఘ్నుఁ డంత
సమరసన్నద్ధుఁడై చనుచు పోరికిని
విశ్రాంతికోఱకయి వెడలి వాల్మీకి
యాశ్రమమందున నాగె నారేయి.
జనకజ సుఖముగా కనియె నానాఁడె
మునియాశ్రమమ్మున తనయు లిద్దఱిని
జనకజాం గూర్చిన సంతోషవార్త
వినిన శత్రుఘ్నుఁడు మనమున నలరె.

జనకజ కుశలమ్ము వినిన యంతటనె
ఇనుమడించిన బల మ్మెసఁగి శత్రుఘ్ను
డరిగెను వేగ మా యసురునిఁ జంప
మఱునాఁడె పయనమై మధుపురమ్మునకు.

అరిగి శత్రుఘ్నుఁ డాపరిసరమ్ములనె
హరునిశూలము తనకరమందు లేక
తిరుగాడు లవణుని తిలకించి తనకు
సరియైన కాల మీతత్క్షణమని తలఁచి

"లోకకంటక ! నిన్ను బోకార్చఁగోరి యిక్కె
నీకెదు రరుదెంచి నిలిచి నానిచట
పాఱుబోతా! యింక పారిపోబోకు
పోరిలో నిన్నిదే ప్రాలియింతు" ననగ
తనశూలమును వెంటఁ గొనిరాని పనికి
మనమున లవణుఁడు వనరి యొక్కింత
సమరమ్మునకు వచ్చె శత్రుఘ్ను తోడ
సముద్రిక రోష వేషావేశుఁ డగుచు.

ధారుణి కంపించు తీరున రేగి
ఘోరయుద్ధమ్ము మొవారె కిర్వురకు.
విహరించి దుర్వార వీరుఁడై యనిని
బహువిధ శస్త్రాస్త్ర బాణాగ్నిఁ గురిసి
అతులిత బాహుబలాధిక్య మలర
హతమార్చె శత్రుఘ్నుఁడా దైత్యవరుని
భూవలయము నొక మూలకుఁ ద్రోయు
రావణు నంతటి రణవీరుఁడైన

లవణుని శత్రుఘ్నుఁ డవలీల ద్రుంచె
నవని దుర్లభ మిట్టిదనుటతిశయ మనుచు
మునులును జనులు నా దనుజుని మృతికి
మనముల ముదమంది మధుపురమ్మునకు
జననాథుఁ జేసిరి శత్రుఘ్ను నపుడు
వినుతసామ్రాజ్యార్హ విభవమ్ము లలర.

---

## శ్రీరాముఁ డగస్త్యుని క్రతువు దర్శించుట

ముని యగస్త్యుం డొకముఖ్యమౌ క్రతువు
నొనరించు చున్నట్లు విని రాముఁ డరిగి
ముని యగస్త్యునకును మునుల కెల్లరకు
వినయమ్ముతో మ్రొక్కి వీక్షించె క్రతువు.

రాజాధిరాజును రాజితగుణుఁడు
భూజనవంద్యుఁడు పుణ్యాత్ముఁ డైన
రాముఁ డేతెంచెను క్రతువునుఁ జూడ.
భూమీశులం దిట్టి పుణ్యభావమ్ము
లింతటి నయశీల మెఱుఁగ మటంచు
సంతసమంది రాసంయమివరులు.
సవనమ్ము లొనరించి చరితార్థు లైన
అవనీశముఖ్యుల వివిధసత్కథలు

రెండుదినమ్ము లాఋష్యాశ్రమమున
నుండి రాముఁడు విని నుత్సాహ మెసఁగ.
నిర్వహింపగ మునుల్ సిద్ధాత్ములగుచు
సర్వసమ్మతముగ జన్నమ్ము ముగిసె.
సవనహవ్యమ్ముల సరసత మీఱ
దివినుండి యరుదెంచి దేవతల్ గొనుచు
మునికులమ్ముల నెల్ల ప్రసన్నహాసులను
ఘనముగ దీవించి చనిరి వెన్కకును.
జనులకు జగతికి సంశ్రేయ మెంచి
మునులు నిస్స్వార్థులై యొసఁగించు కృతుల
మునుల త్యాగమ్మును మునుల యాశయము
మునుల చరిత్రము మునుల జీవనము
మఱిమఱి మెచ్చుచు మానసమందు
తిరిగి యయోధ్యకు నరిగె రాముఁడు.

---

## శ్రీరాముఁ డశ్వమేధయాగ మొనరించుట

అమరులఁ దనియించి యవని కొసంగు
సమధిక సంపదల్ జన్నమ్ము లనుచు
విశ్వప్రశస్తమై విలసిల్లు యాగ
మశ్వమేధ మొనర్ప నాత్మలోఁ దలఁచి
రాముఁడు మునులను రావించి నడువ

ఆమోదమును జెల్వ కలరుచు రాము
తనమంత్రివర్యులు తనసహోదరులు
వెనువెంటనే శాస్త్రవిధి విధానముగ
సకలసన్నాహముల్ సలిపిరి వేగ
సకలసంభారముల్ సమకూర్చినారు.
అతిశీఘ్రము మందటి కాహ్వాన మంపి
క్రతుదీక్షితుం డయ్యె రామచంద్రుడు
వచ్చిరి మునివరుల్ బంధుమిత్రులును
వచ్చిరి రాజులు వానరాధిపులు
వచ్చెను లంకాధిపతి విభీషణుడు
వచ్చినవా రెల్ల దెచ్చిరి ప్రీతి
మణిమయ భూషణ ధనధాన్య మహిత
కనకాంబరాదులు కానుక లెన్నొటినా.
తనవెంట లవకుశుల్ తనశిష్యగణము
చనుదేర వాల్మీకి సంయమి వచ్చె.
అకలంక రీతిగా నతిథుల కెల్ల
సకలమర్యాదలు జరిగె నచ్చోట.
జవమున లక్ష్మణుం డవనియంతటను
సవనాశ్వమును ద్రిప్పి జయముతో వచ్చె.

రాజితసమ్మాన రమ్యసత్కృతులు
భోజనపంక్తులు భూరిదానములు

ఆ వేడ్క లావింపు లా వినోదములు
ఆ వేదపాఠమ్ము లా క్రతుక్రమము
లాయత ధర్మనిష్ఠాభ్యాస విధుల
కా యాగతజనాళి కంతమ్ము లేక
ఆ యజ్ఞవేళయం దలరి పెంపారె
నా యయోధ్యాపుర మ్మమరధామముగ.

---

## లవకుశులు అయోధ్యలో రామాయణమును గానము చేయుట

తరుణమ్ముఁ గనుగొని తపసి వాల్మీకి
ధరణిజాత్మజులను దరికిరాఁ బిలిచి
"ఎలమి మీ యిర్వురు నేకకంఠముగ
లలితగీతముల నో లవకుశులార !
రాముని చరితమ్ము రామాయణమును
మీ మనోహరగాన సామర్థ్య మెసఁగ
రంగారు సాకేత రాజమార్గముల
అంగడులందున యజ్ఞశాలలను
గానమొనర్పుడు కమనీయఫణితి
వీనులవిందుగా వినువారికెల్ల.

భూమివాసుల తండ్రి భూపతి గాన
రామునే తండ్రిగా మీమది నెంచి
ఇక్ష్వాకు లనుగుచో నెపుడు మీరనుచు
చెప్పెను వాల్మీకి శిష్యుల మనుచు,
మేలగు గావుత" మీకిచ్చె టవియు
బాలుర దీవించి పంపె వాల్మీకి.
ప్రవిమలాకారు లారాముని సుతులు
దివినుండి దిగినట్టి దేవతల్ వారు
జానకీరాముల సచ్చరిత్రమును
వీణల చేబూని వీధివీథులను
రారయ్య జనులార రమణీయమైన
శ్రీరామకథ మీకు చెప్పెదమయ్య,
ప్రవిమలానంద మారాముని చరిత
చవులూరు వాల్మీకిసంయమి కవిత
శ్రీమహావిష్ణు వారాఘునేత
శ్రీమహాలక్ష్మి యాయోనిజాత సీత,
అవతారమూర్తు లీయవనిని వారు
అవని శ్రేయము నెంచి అరుదెంచినారు,
పరికింప తాత్త్వికుల్ భవ్యసత్కృతులు
కరుణాచరిత్రు లాసురుచిరాకృతులు,
రాముడు రారాజు రాజ్ఞి సీతమ్మ
భూమిపై స్వర్గమ్ము రామరాజ్యమ్ము

చల్లని దైవముల్ జగతికంతటికి
తల్లిదండ్రులు వారు ధరణి నెల్లరకు
జనకజారాముల సచ్చరిత్రమ్ము
జనులార రాగమ్ము వినుపింతు మేము."
అనుచు రామాయణ మాద్యంత మచట
వినయసౌజన్య లాబిడ్డలిద్దఱును
గానమాధుర్యముల్ కాల్వలై పార
వీణల చేఁబూని వినిపించి సంత
తేనెలు వర్షించె తీయముల్ గురిసె
అనాఁడయోధ్యయుం దన్నిచోటులను.
లాలిత వాక్సుధా వ్యాలోల మైన
బాలుర మాటలో పాటలలోన
వీణాతీవలనుండి విశ్వమ్ము నిండి
రాణచెల్వారిన రామనామమ్ము
ఎంతమనోహర మ్మెంత రమ్యమ్ము
ఎంత సమ్మోహన మెంత హృద్యమ్ము
ఆమోదభర సంపదారామ మగుచు
రామమయమ్మయ్యె భూమి సర్వమ్ము.
దేవతాదేవుని దివ్యనామమ్ము
పావనమ్మొనరించె వసుధనంతటిని,
సంగీత సాహిత్య సమ్మోద ఝరులు
పొంగెత్తి ప్రవహించె పురవీథులందు.

అవతారమూర్తు లాయుడుఁ వక్త్రనుల
ప్రవిమలచరితలోఁ బ్రతుకులే నిండి
పరువెత్తి పురజనుల్ బాలురవెంట
పరవశస్థులైరి యాపాటలు వినుచు.

ఏమి యీ మాధుర్య మేమి యీగాన
మీ మనోజ్ఞాకారు లెవరు వీ రనుచు
బాలురమాటయే పట్టణమెల్ల
బాలురమాటయే పౌరుల నోట
శ్రీమహనీయ మా రాముని చరిత
మామోదముగ గాన మాలపించుచును
భువనసుందర దివ్య మోహనాకృతులు
లవకుశుల్ సుకుమార లావణ్యతనులు
పురవీథులందునఁ దిరుగుచు వేగ
అరిగినంతనె రాము యజ్ఞవాటికకు.

తిలకించి రామునకుఁ పులకించె మదిని
మొలకెత్తె నేదియో పుత్రభావమ్ము.
ఆముగ్ధసౌందర్య మారాజఠీవి
ఆమోముపోలిక లామేనిసొబగు
లాబాలవీరుల యందమ్ము లరసి
నాబిడ్డలే వీరు నవ్యమన్మథులు

మునియాశ్రమమ్మున జనకజ కనిన
తనయులే వీరని తలఁచె రాముండు.

ప్రల్లదు లాడిన పలుకుల కోడి
వెల్లిసె చెల్లకో సీత నానాఁడు
కాననమ్ముల కంపె కఠినుఁడై కాని
తా నీవియోగమ్ము తాళఁగలండె ?
ఏపాపమెఱుఁగని యింతి యాసీత
ఏపాట్లు పడినదో యెఱుఁగగా ననుచు.
చేతమ్మునందున చింతించి తుదకు
ప్రీతిమై లక్ష్మణుం బిలచి రాముండు
"వని కేగి వాల్మీకిముని కిట్లు జెప్పి
కొనిరమ్ము లక్ష్మణా ! జనకజ" ననియె

"జానకి సౌశీల్యసంపద నెల్ల
మానసమ్మందున మాయన్న యెఱుఁగు
ఆతతప్రేమతో ఆరాము డింక
సీతను సుమ్మీఁను చేకొను, నయిన
జనులకు నమ్మిక జనియించుకొఱకు
తనప్రవర్తనఁ గూర్చి తప్పక మరల
జనులున్న సభలోన శపథమ్ముఁ జేసి
జనకజ తెలుపుట చాలమే"లనుచు

మునికి నామాటగా వినిపించి వేగ
కొనిరమ్ము జానకి నని చెప్పిపంపె.

రాముని మాటకు మోము విప్పారి
ఆమోదమలరంగ నతిశీఘ్రగతుల
సౌమిత్రి వని కేగి యామునితోడ
రాముని మాటల క్రమము వచించె.
శ్రీరాము వాంఛను సీత కాదనదు
ఆకాంక్షిగా పోద మనుచు వాల్మీకి
మునిచంద్రుఁ డేగెను ముదమున నపుడు
జనకజం దోడ్కొని సాకేతపురికి.

---

## భూదేవి సీతను గొంపోవుట

ధరణిపుల్ మునులను పురజను లెల్ల
రరుదెంచినట్టి యాయజ్ఞవాటికకు
జనకజం గొనివచ్చి సభికులు వినఁగ
వినయమ్ముగా నిట్టు లనియె వాల్మీకి.
"శ్రీరమ్యగుణసాంద్ర! శ్రీరామచంద్ర!
కారుణ్యగుణధామ! కమనీయనామ!
సౌమిత్రి నుడువంగ నీమాట లెల్ల
ఆమోదమయ్యెను నామదియందు

కనుఁగొను మయ్య నాపను వెంట నిదిగో
చనుదెంచె సీత నీ చరణసేవలకు.
భువిమీఁద ధర్మమున్ బొలుపార నిలుప
దివినుండి వచ్చిన దేవుఁడ వీవు
నేనెంతవాఁడను నీకుఁ జెప్పంగ
ఐనను నావాక్య మాలింపు మొకటి
పాఱుఁ డొక్కండన్న పలుకుల కోడి
ఈరీతి నీభార్య నెడఁబాయఁ దగునె
భూపుత్రి యీసీత పుణ్యచారిత్ర
ఏపాప మెఱుఁగని దీయింతి వినుము.
తెలుపంగ లేదె ఈలలితాంగిశీల
మలనాఁడు లంకలో నగ్నిదేవుండె.
నీమాటకొలఁది యాసౌమిత్రి వచ్చి
భూమిజన్ విడనాడి పోయిన యపుడు.
జానకి నొంటిగా కాననవీథి
నానాఁడు జూచి నాయాశ్రమస్థలికి
అనునయించుచు చాల నాదరమ్మెసఁగ
కొనివచ్చినా రయ్య మునికాంత లరిగి.
లవకుశు లీకవ లవనీంద్ర! కనుము
ప్రవిమలాకృతులు నీబాలురు వీరు.
పెరిగిరి నాకడ పెద్దవారైరి
సురుచిర సద్గుణ శోభితుల్ వీరు

చేకొనుమయ్య నీ చిఱుతగొలదుల
జనులు హర్షింతురు జగము హర్షించు
మునులును హర్షమ్ము పొందుదు" రనఁగ

శ్రీరాముఁ డంతట చేతులు మోడ్చి
పౌరులెల్లరు విన వాల్మీకి వినఁగ
"అనఘాత్ములార నా కాత్మలోఁ దెలియు
జనకజ నిర్మలసౌశీల్య మెల్ల
మునిచంద్రుఁ డిట్టుల వినిపించు కంటె
జనులమధ్యమ్మున శపథమ్ము జేసి
జనుల కింకొకసారి తనప్రవర్తనము
జనకజ తెలుపుచో చాల మే" లనియె.

మరల నిట్టి పరీక్ష ధరణిజ కేల
జరిగిన దెల్లను చాలదా యనుచు
జనులెల్ల శ్రీరాముఁ డనిన వాక్యములు
విని మనమ్ములయందు విభ్రాంతులైరి.

నలువురి ముందున నగుబాటు గాఁగ
తలగొట్టి నట్లయ్యె ధరణిజ కపుడు.
చెచ్చెర రాపించి శ్రీరామవిభుఁడె
రచ్చకీడ్చుట లేల రాపాడు టేల !
ఈ పరీక్షలు తన కింకెన్ని కలవొ ?"

భూపుత్రి రోదించె "భూమిపై తనదు
పరువుపోయినది యే తెరువు కన్పడదు.
ధరణిపై తనకింక స్థానమ్ము లేదు."
జనుల సంభావించి మునులకు మ్రొక్కి
తనపతిపాదముల్ కనుల కద్దుకొని
కనుదోయి నశ్రువుల్ కాల్వలై పార
తనయులన్ కడసారి తనివి ముద్దాడి
భూతలమ్మున దృష్టి పొలుపుగా నిలిపి
చేతులు జోడించి సీతపల్కినది.

"సతతమ్ము రామాజ్ఞ జరియింతు నేని
పతిని దైవమ్ముగా భావింతు నేని
నిత్యమ్ము రాముని నే గొల్తు నేని
ప్రత్యక్షసాక్షిగా పంచభూతములె
ఏపాప మెఱుగని యిల్లాలి నేని
ఈ పాట్లు దప్పించి యికనైన నాకు
త్రోవజూపవె నేడు కావవే నన్ను
బ్రోవవే నాతల్లి భూదేవి" యనుచు.

ఉల్లమ్ము లగులగా నుర్విజ యట్లు
తల్లిని ప్రార్థించి తలను వాల్చినది.

జనకజ శోకమ్ము జనకజ మనవి
కనిన దెప్పుడో తాను వినిన దేక్షణమొ

కడుతీక్ష్ణముగు నొక్క కాంతి దీపింప
పుడమి బ్రద్దలు చేసి భూదేవి వచ్చి
నలుగడ నిలుచుండి నాగకన్యకలు
విలసితభూషణావితతిఁ గైసేయ
సీతను నవరత్న సింహాసనమున
ప్రీతిగఁ గూర్చుండఁ బెట్టి గొంపోయె.
అరనిమిషమ్ములో జరిగె సర్వమ్ము
ధరణితో బ్రద్దలై దారియిచ్చినది
శ్రీరమారమణి ఆ సీతమ్మ తల్లి
ధారుణీగర్భానఁ జేరిపోయినది.

భూతలమ్మున కింక సీతమ్మ రాదు
భూతలమ్మున లేదు సీతమ్మతల్లి.
నిలుచున్నవా రట్లె నిశ్చేష్ట వడిరి
పలుకఁ జాలక నొక్కపలుకైనఁ గూడ
ధరణిపై తమ కింక తల్లి లే దనుచు
దారఁదల్లి యేడ్చిరి ప్రజలు ఎల్ల.



## సీతకొఱకు శ్రీరాముని దుఃఖము

ఏమైన దిపుడు తా నేమి యొనర్చె
భూమిజ జానకి భూమి పాల్గాఁగ,

ఎవరికై యానాడు శివుని విల్విఱిచి
ఎవరికై రావణున్ బవరాన గెల్చి

ఎవరికై వెతఁజెంది యిన్నాళ్ళు తాను
ఎవరినాసించి కేఁడిచటకుఁ బిలిచె.
తనసీత తనభార్య తనకు లేకుంట
కనుపించె శూన్యమై కనులకు జగము.
తలపోసి రాముఁడు తనమనోవ్యధలు
నిలువున నీరయి విలపించె నిట్లు.
"రామునిఁ గూరిచి నీమానసమున
ఏమనితలఁచి నీవిట్లు జేసితివె
సౌశీల్యరాశి ! ఓ జానకిదేవి !
ఆశతో రమ్మని అర్థించినాను
మామంచు నీ వొకమాటను దెల్పి
ప్రేమతో నావైపు విచ్చేయుదనుచు.
ఆసించి నిన్నట్లు లడిగితిఁ గాని
హాసీత ! నీమన స్సరయలే నైతి.
ఇంతమాత్రమున నీవింతసాహసము
పంతానఁ జేసితే పలువురిముందు.
శ్రీరాముఁ డొకయెగ్గ చేసెనే యనుము
సైరింపలేవె ఈస్వల్పమాత్రమును
ఎఱుఁగుదే సీత నీకొఱకు నేనెంత

దురపిల్లి యొంటిగా దుఃఖించినానో
దనుజుఁడు నిన్నిటుఁ గొనిపోయి నపుడు
వినుతచారిత్ర నిన్ గనుగొనలేక
విలపించితిని నాఁడు విపినమార్గముల
విలపించెద నయోధ్య వీథిని నేఁడు.
నను వీడి యేగితే నాభాగ్యరాశి,
నను నేలు మఱచితే నాసీత! యనుచు
ఆననమ్మెల్లైన నశ్రువుల్ గ్రమ్మ
దీనుఁడై రాముఁడు ధీరత వీడి
విలపించె పలుమార్లు తలఁచి జానకిని.
పలుకవే జానకి పలుకవే యనుచు.

---

## రాముఁడు భూదేవిపై కోపించి బాణ మేయబోవుట

విలపించి రాముఁడు పలుమాఱు లిట్లు
తొలిదుఃఖ మొక్కింత తొలఁగిన యంత
భూపుత్రిపైఁగల మోహభావమ్ము
కోపమ్ముగా మాఱె కుంభినిమీఁద
"అవని రాఘవుఁ డెంత అలుసయి పోయె
అవనిజ నప్పుడా యడవిలో నన్ను

కనుగప్పి యసురుఁడు కొనిపోయినాఁడు,
కనులముందే నేఁడు కొనిపోయె భూమి.
ఈరీతి నవమాన మిలమీఁదఁ బడుచు
భీరువై పడియుండఁ డీరాముఁ డిఁకను.
చెడుతలం పతరిన నడవడి కాక
పుడమియెంతటిది నాపతిఁ గొంపోవ
నాసీత నిటుఁదెచ్చి నాకీయకున్న
ఈసమస్తక్షోణి నేకబాణమున
చూర్ణమ్ముఁ గావించి చూపెద ననుచు
పూర్ణాగ్రహమ్మొద పొంగులువార
చాపమ్ము సారించి శరము సంధించి
కోపాన రాముఁడు కొట్టఁబోవంగ,

"ఆగుమో శ్రీరామ! అవని నేయకుము
ఆగుమయ్యా దేవ! అఖిలేశ!" యనుచు
పరువున బ్రహ్మాదిసుర లరుదెంచి
మొఱపెట్టి రాముని ముంగల నిలచి
"సర్వజగన్నాథ! సర్వమయాత్మ!
సర్వేశ్వరా! రామ! సర్వరక్షకుఁడ!
ఈభూమి యెల్ల నీసృష్టియే కాదె
ఈభూతసంచయ మ్మెల్ల నీయదియె
ఒకసీతకొఱకు నీవుర్విని, ద్రుంప

సకలమ్ము వికలమై సమయును దేవ !
విశ్వమ్ము నీయందె విలసిల్లుచున్న
విశ్వనాథుండ వీ విపరీత మేల ?
సీతయేగున నీదు చేతమ్ము వీడి
సీతయు నీవును చిరజీవు లవని,
జానకీరాముల సంయోగగాథ
మానితాదర్శమై మహిమీద వెలసి
ఆచంద్రతారార్క మలరును దేవ!
ప్రాచుర్య పావనభాగ్యమై భువికి
వ్రాసియుంచెను మున్నె వాల్మీకిమౌని
భాసురమ్మైన మీపావనచరిత
అమరభాషామృత మ్మాదికావ్యమ్ము
రమణీయ గ్రంథమ్ము రామాయణముగ,
విశ్వసంశ్రేయమై విజ్ఞాన మొసఁగి
శాశ్వతమ్ముగ నిల్చు జగతి నీచరిత
శాంతింపురామ ! ఈసత్యమ్ము నెల్ల
స్వాంతమ్మునం జూచి చాపమ్ము విడుము
చేకొమ్ము కూర్మి నీ చిన్నబిడ్డలను
చేకొన్న క్రతుపూర్తి చేయు" మనఁగ
శాంతించె రాముఁడు చాపమ్ము విడచి
సంతసమందిరి జనులు సంయములు.

## శ్రీరాముని యజ్ఞసంపూర్తి

చేతమ్మునందున సీతను పిల్చి
ప్రీతిగ దరిఁ జేర్చి బిడ్డలిద్దఱిని
సన్మానరీతుల శాస్త్రోక్తవిధుల
జన్నమ్ము రాముఁడు సంపూర్తిఁ జేసి,
అమరముఖ్యులు వచ్చి ఆశీస్సు లిచ్చి
క్రమముగ హవ్యముల్ గ్రహియించి చనిరి.
పదపడి వాల్మీకి బాలుర చేత
చదివించె సభ్యులు ముదమంది వినఁగ
రమణీయమగు తన రామాయణమున
కమనీయ ముత్తరకాండమ్ము నెల్ల
సరసత నీ పుణ్య చరిత మాలించి
అరిగి రెల్లరు రాము నభినుతించుచును
రాముఁడు గైకొని రాజ్యభారమును
భూమినిఁ బాలించె పుణ్యకార్యముగ
భువనసంపూజ్యుఁడు పుణ్యవర్తనుఁడు
రవికులసోముఁ డా రామభూవిభుఁడు
తనదేలుబడిలోని జనుల శ్రేయమ్మె
తనకిల పరమార్థ మనుచు భావించి
యజ్ఞమ్ము లొనరించె నతిథులఁ దనిపె
విజ్ఞుల సేవించి విబుధులఁ గొల్చె
సలిపె సత్కార్యముల్ సద్గోష్ఠి నెఱపె

విలసితదానముల్ విప్రుల కిచ్చె
ఎన్ని జేసియుఁగూడ నెపుడ రాముని

సన్నిఁయు గొలిచెయ్యె నవనిజ లేక
మఱచియు రాముఁ జేమాటలనైన
మఱవఁజాలక తనమదిని జానకిని.
బాలురఁ గనుగొంచు నేలోటు లేక
కాలమ్ము యాంత్రికప్రేమగాఁ గడపె.

---

## కౌసల్య సుమిత్ర కైకేయుల మరణము

సాదరచిత్తులై జనులను గనుచు
మేదినిధర్మముల్ మేలుగా నిలిపి
రాజుగా రాముఁడు రాజ్యమేలఁగ
రాజితమూర్తు లా రాజమాతలును
వాసిగ దశరథవసుధేశు సతులు
కౌసల్యయు సుమిత్ర కైకేయి మిగుల
నానంద మందిరి యాత్మల యెంచు
మానుగ ఫలియించె మా జన్మలనుచు.
జానకి లేనట్టి సంతాపభరము
రానీయకుండఁగ రాము నోదార్చి
బుడుతమన్మలఁ గని ముద్దాడుకొనుచు
గడపుచుండిరి తమకాలమ్ము నెల్ల.

వేలాదియేండ్లుగా పృథ్వీతలమ్ము
నేలిన దశరథు నిల్లాండ్రు వారు
భూరియశస్కులౌ పుత్రులఁ గనిన
వీరమాతలు నేఁడు వృద్ధులైనారు.
అకలంక చరితుఁడౌ నాత్మేశుఁ గలియ
ఒకరివెన్కగ నొక్కరుర్విని వీడి
చనిరి యామువ్వురున్ స్వర్లోకమునకు
తనయులు దుఃఖాన మునిగి శోకింప.



## భరతుని సుతులు గాంధారపతులగుట

కైకేయి తమ్ముఁడు కేకయనృపతి
సాకేతమున రామచంద్రునిఁ జూచి
వినిపింప గంధర్వ లొనరించు దౌష్ట్య
మని పెను గార్గ్యుడన్ మునిచంద్రు నొకని

సింధునదీ తీర సీమలయందు
గంధర్వులెందరో గర్వాన వచ్చి
ప్రజలను పీడించి రాజుల నణచి
నిజరాజ్యపదముల నెమ్మి నిర్మించి
విహరించుచుండిరి విచ్చలవిడిగ.
మహిమీఁద వారల మదమణగింప

రామ ! నీవే యిటు రావలె ననుచు
ఆహ్వాన మనుపగా రాముఁడాలించి
నిరుపమ బలుఁడైన భరతునిఁ బిలచి
"భరతుఁడా తగుసైన్యబలముతో నేగి
మనమామ కేకయ మనుజనాథునకు
వినతుల నర్పించి వేగమ్మె యచటి
వైరులఁ బరిమార్చి వారిభూములకు
ధారుణీశులుగ నీతనయు లిర్వురిని
తక్షపుష్కలులను తనరంగ నిలిపి
అక్షయ్య దృఢకీర్తి నార్జించి రమ్మనుచు
భరతుని సుతులకు పట్టమ్ముగట్టి
భరతునితోఁగూడ పంపె రాముండు.

సమరసంరంభుఁడై సైన్యబలమ్ము
సమకూర్చి భరతుఁడు చయ్యన నేగె.
మాన్యుఁ డాతని మేనమామయుఁ గూడ
సైన్యమ్ముతో వచ్చి సాయ మ్మొనర్చె.
శైలూషుఁ డాదిగా సర్వగంధర్వ
పాలకుల్ భరతునిపైకి దండెత్తి
మాయాచరణమ్మును జేయ నుంకింప
పాయని ధైర్యాన భరతుఁ డెదిరించి
బలము లొక్కుమ్మడి వారిపై నంపి

విలసిత భుజబల విక్రమమ్మొదర
పరిపోవుట కైన దారి లేకుండ
దారుణ శరవృష్టి ధారగాఁ గురిసి
గంధర్వులను గెల్చి కపశదీపింప
గాంధారరాజ్యాన కడు వైభవముగ
జనులెల్ల హర్షింప తనకుమారులను
మనుజేశులనుఁ జేసి మగిడి యేతెంచె.

## శత్రుఘ్నుని కుమారులు మధుపురాధిపతులగుట

అనుచరయుతముగా నసురేంద్రు లవణు
నని లోన శత్రుఘ్నుఁ డంత మొందించి
బహుళసంపదలతో భాసిల్లు నట్లు
మహనీయరీతిగా మధుపుర మ్మేలి
తన పుత్రులు సుబాహుడును శత్రుఘాతి
యనువారి నిర్వురి నతిముదమ్మలర
మధువిదిశాఖ్యలౌ మండలమ్ములకు
పృథివీశులం జేసి వివిధసైన్యముల
వారికి సమముగా భాగించియిచ్చి
శ్రీరాముసేవింప చిత్తమునందు
కోరిక వొడముగా చేరె నయోధ్య
వీరశేఖరుఁడయి విజయుఁడై తిరిగి.

రావణు నంతటి రాక్షసుఁ లవణు
కావర మ్మడగించె కడక శత్రుఘ్నుఁ
డనిలోన గంధర్వు లందఱిం గెల్చి
చనుదెంచె భరతుఁడు సాహస మ్మెసఁగ
తమ్ముల విజయముల్ తగునీతి పొగడి
సమ్మోదమున రామచంద్రుఁ డుప్పొంగె.

---

## లక్ష్మణుని సుతులు రాజు లగుట

భరతశత్రుఘ్నులు వారిపుత్రులను
పరిపాలకులఁ జేసి వచ్చుట కలరి
విలసితసద్గుణుల్ విక్రమధనులు
లలితస్వరూపులు లక్ష్మణసుతులు
ప్రీతి నంగద చంద్రకేతులఁ గూడ
ధాత్రీశులఁ జేసె సరవి శ్రీరాముఁ
డంగభూమికిని మల్లావనీస్థలికి
మంగళోత్సవ కార్యమహిమ లింపార.

తమపుత్రులకు రాజ్యధర్మముల్ తెలిపి
రమణీయముగ వారు ప్రజ నేలుచుండ
కనుగొని మనముల కడుముద మంది

అనుజులు మువ్వురు ననుపెంచి నారు
నరగున సాకేత పురికి శ్రీరాము
చరణసేవయె తమ పరమార్థ మనుచు.

---

## బ్రహ్మదేవుని దూతగ యముఁడు రాముని దర్శించుట

ఈరీతిగా కాల మేగుచునుండ
శ్రీరామునకు నొకఋషి యేగుదెంచి
"అనుపెంచితిని రామ! త్వరగ నీకొక్క-
పరమరహస్యమున్ వచియించుకొఱకు
మనము మాటాడుచో మనమధ్య కెవరు
చనుదేర రాదట్లు చనుదెంచు నరుని
మరణశిక్షకు నీవు గురిసేయువలయు
నటుకే వాదుసీరని మదినెంచఁ బోక
అటులైన చెప్పెద ననఁగ నామౌని,'
యటులనే యని రాముఁ డంగీకరించి
దాపున కెవరును తరలిరాకుండ
కాపుంచె ద్వారమ్ముకడనె లక్ష్మణుని.
ఆకడ కెవ్వరు రాకుండఁ జూచి
నేకాంతమున మునియిట్లు వచించె.

“పరమేష్ఠి పంపగా వచ్చితి నయ్య!
సరగున నొకవార్త నెఱిఁగింప నీకు
మునినయి యముఁడను ముదమున నిటకు,
వినుమయ్య యావార్త విన్నవించెదను.
“నారాయణుండవు శ్రీరామ నీవు
ధారుణీతలమున దైత్యుల బాధ
వారింప సురలకు వాగ్దాన మొసఁగి
శ్రీరామమూర్తిగా క్షితిఁ బుట్టితివి,
రావణుం డాదిగా రాక్షసతతిని
కావర మడఁగించి కడతేర్చినావు,
ధరణీతలమ్మున ధర్మమ్ము నిలిపి
కరుణతో సాధుఁ గాపాడినావు,
ఆదర్శనృపతిగా నవని నేలితివి
ఆదర్శనరునిగా నవని నిల్చితివి,
క్షేమదాయక మయి భూమి నెల్లపుడు
రామరాజ్యము నిల్చు రాజితరీతి
పూర్తి జేసితివి నీపుణ్యకార్యమ్ము
కీర్తి కెక్కినది నీవర్తనమ్మెల్ల
చేరెను శ్రీలక్ష్మి సీత యిచ్చటకు
శ్రీరామ నీపాదసేవల కొఱకు
పావనమ్మైన నీ వైకుంఠపురికి
వేవేగ నీవిక విచ్చేయవలయు

నీరజానేత్రు(రా) నిన్నుఁ గొల్వంగ
నీరాక కొఱకునై నిలిచినా" ననుచు
పరమేష్ఠి పంపిన వార్త శ్రీరామ !
అరుదెంచి నుడివితి" నని యా యముండు.

---

## లక్ష్మణదేవుని ప్రాణత్యాగము

పరమేష్ఠి పంపిన వార్తనాలించి
మరల రాఘవుఁ డేదో మాటాడుచుండ
వినవచ్చె నాగది వెలుపలి నుండి
ధ్వని యొకఁ డెవ్వరో పలుకుచున్నట్లు.

"తనయుఁడ శ్రీరామ ధరణిపాలునకు
నుడువుడు నారాక కడువేగ" మనుచు
ముక్కోపి దుర్వాసముని కేకలిడుచు
గ్రక్కున ద్వారమ్ముకడ కేగుదెంచె.
ఆమౌని రభసమ్ము నరసి లక్ష్మణుఁడు
"స్వామి తాళు డొకింత రాముఁడు లోన
మంతనం బొకరితో మాటాడుచుండె
ఇంతలో వచ్చి మిమ్మర్చించు" ననఁగ
పటుకోపమున రేగి పండ్లు దీటించి
తటతట లాడుచు దుర్వాసమౌని

"శిష్యుఁడైన నాకడ్డు చెప్పగ లేదు
ఎవరురా! నీవు నన్నిట్టు లాపెదవు?
ఇప్పుడే దుర్వాసుఁ డేతెంచె ననుచు
చెప్పుము రాముతో శీఘ్రమ్ము నీవు
నీ వేగకుండిన నిన్ను శపించి
నీవంశనాశమ్ము గావింతు" ననియె.
ఒకప్రక్క దుర్వాసు నుగ్రకోపమ్ము
ఒకప్రక్క శ్రీరాముఁ డొసఁగిన యాజ్ఞ
ఉరి వెట్టినట్లయి యుల్లమ్మునందు
ఎఱుగక తానప్పు డేమిచేయుటయు,
సకలబంధువులును సమయుటకంటె
ఒకఁడు చచ్చుటయె మేలుర్విపై ననుచు
వెనుకాడకుండగ వెడలి లక్ష్మణుఁడు
మునిరాక లోనికిం బోయి వచించె
శ్రీరామమూర్తియున్ ఋషిచంద్రుఁ డున్న
ద్వారంపుతలుపులు భళ్ళున తెఱచి
తమకు లక్ష్మణుఁ డడ్డుతగిలె నటంచు
యముఁ డాగ్రహించి తానరిగెను మగిడి.

శ్రీరామచంద్రుఁడును శీఘ్రమ్ము వచ్చి
ద్వారమ్ముకడ నున్న తపసినిఁ జూచి
అతఁ డాకలిగొను టాత్మలో నెఱిఁగి
అతనిక్షుధ దీర్చి యర్చించి పంపె.

తానేనా మాతఁమూర్ఖని యుంపఁగ
ఆనతి లేకుండ లోనికి వచ్చి
శిక్షార్హు డయ్యెను లక్ష్మణుం డనుచు
వీక్షించి రాముఁడీ విషమసంఘటన
ముని వసిష్ఠాదు లౌ ముఖ్యులఁ బిలచి
వినిపించె కర్తవ్య విషయమ్ము లెల్ల.
"ప్రతినకు రారాదు వ్యతిరేక మెప్డు
ప్రతినదప్పిన సత్యవచనమ్ము తప్పు
సత్యమ్ము దప్పుట జగతికే ముప్పు
ప్రత్యవాయము ధర్మపాలనమ్మునకు.
అనుజునికంటె ఈ యువని సూనృతమె
ఘనతర" మ్మని చెప్పె మాను తేగినాడు.

కనులముందుగ నున్న కర్తవ్య మరసి
మనమున దుఃఖించి కనలె రాముండు.
అలఘువీరుఁడు ధీరుఁ డతినీతి పరుఁడు
లలితమర్యాదుఁ డీ లక్ష్మణమూర్తి.
అపరాధ మేమియు నవని లేకుండ
విపరీతమీరీతి విధి చేసె ననుచు
స్వాంతమ్మునం దతిసంతాప మంది
చింతానిమగ్నుఁడై చెడి ధైర్యమెల్ల
చిననాఁటినుండియు తనతోడు విడక

తనతోడిదే లోకమని విశ్వసించి
తనవెంట నడవికి తనయు కేతెంచి
తనకొఱకు బ్రతుకెల్ల త్యాగమ్మొనర్చి
బహువిధ సద్గుణ భాసురుండగుచు
మహిమీఁద నలరిన మహనీయమూర్తి
తనతమ్ముఁ డిటులయ్యెఁ; దనకిఁక యెట్లయ్యె
తనకేమి మిగిలెను ధరణియందనుచు
గతిలేని మనుజుని కరణి దుఃఖించె
ధృతియెల్లఁ దూలిన రీతి రాముండు.

అన్నగారి విచార మరసి లక్ష్మణుండు
అన్నపాదము లంటి యంజలి బట్టి
"సోదరుఁ డనుమను వగవకో రామ !
నీధర్మమును నీవు నెఱవేర్పుమయ్య
నీయానతిని మీఱి నీమమున్ముంచె
చేయరానిపని చేసితి నేను.
ఈయస్థిపంజర మేనైనఁ గాని
నాయాత్మ శ్రీరామ ! నీయందె నిలుచు.
కరుణయేటికి ధర్మకార్యమ్ము లందు
వరమునీశ్వరు లెల్ల వాక్రుచ్చినారల
రక్షింపు ప్రతినను రామ నన్నింక
శిక్షింపు" మనుచును శిరము నువాల్చె.

తమ్ముని శీలమ్ము తమ్ముని భక్తి
తమ్ముని నీతియు తనమది మెచ్చి
"ఎంతసద్గుణమూర్తి వెంతధీరుఁడవు
ఎంతఘనమ్మైన దిలను నీత్యాగ
మన్నలక్ష్మణ!" యంచు నాదర మ్మెసఁగ
కన్నీరు గార్చుచు కౌఁగిటఁ బూని
వగచుచు తాఁజేయు పనికి నొక్కింత
తెగువతో లక్ష్మణుం దిగిచి రాముండు
పుడమి నెవ్వరినైన పొమ్ము నీవనుచు
విడనాడుటయుగూడ కడకుచంపుటయె
అని యాత్మలోనెంచి అనునయ మ్మెసఁగ
అనుజని దీక్కొయి యనిరె నీరిశి.
సన్నుతసద్గుణ చిన్నతమ్ముండ
మన్నింపుమయ్యా నామాటకు నిలచి
చేసేత నిన్నిట్లు శిక్షింపవలసె
చేసినదేమి నీదోసమ్ము లేక.
శశ్వదాదర్శమై జగతిని నిలుచు
శాశ్వతమ్ముగ నీదు సచ్చరిత్రమ్ము.
వినుము లక్ష్మణుఁడ ఈ పృథ్విని నాఁడు
కనులకు నీవింక కనుపడరాదు
విడనాడుచుంటిని విధిలేక నిన్ను
పుడమి నెచ్చటికైన పొమ్మని పలికె.

## లక్ష్మణదేవుని మహాప్రస్థానము

రాముఁడు లేనట్టి రాజ్యమ్ము లేల
రాముని చూడని ప్రాణమ్ము లేల
ఒక్కటే గమ్యమీ యుర్వి లక్ష్మణున
కొక్కటే లక్ష్యమ్ము ఒక్కటే దారి.
నారాయణుఁడు జగత్కారణుండైన
శ్రీరామమూర్తినే చిత్తాన నిలిపి
అచటి వారెల్ల నశ్రువుల్ నింప
అచలధీరుండయి యరిగి లక్ష్మణుఁడు
భానుకోటి సమాన భాసుర తేజ
మానసమ్మున నెగ్గ సద్భుతకీర్తి
నిరుపమనిజయోగ నిష్ఠను బూని
సరయూతరంగిణీ జలముల మునిగె.
అరుదెంచుచున్నది హరియంశ యనుచు
సురలెల్ల సాష్టాంగ మెఱఁగి రావేళ.
దేవేంద్రుఁ డేతెంచి దివ్యవిమాన
పావనపీఠాన పవళింపఁ జేసి
తనువుతో లక్ష్మణుం గొనిపోయె దివికి
వినువీథులను నిల్చి విబుధు లర్చింప.

దేవతలందఱు దివిపైన తనకుఁ
గావించు పూజలఁ గైకొని వేగ
స్థిరతరాత్మప్రభా తేజస్వి యగుచు
పరమపదమ్మున కరిగె లక్ష్మణుఁడు
ఆదిశేషునిరూప మపురంగఁదాల్చి
శ్రీదేవి విష్ణుల సేవించు కొఱకు
పతి లక్ష్మణుని మహాప్రస్థానవార్త
సతిధీరచిత్తయై యాలించి లేచి
పరమపదమ్మున పతిఁజేరుకొఱకు
సురుచిరాత్మజ్ఞాన శోభిత యగుచు
యోగసమాధిలో నూర్మిళాదేవి
వేగఁ బ్రవేశించి వీడె బ్రాణములు.

## కుశ లవుల పట్టాభిషేకము

పరమేష్ఠి పంపిన వార్తయే మరల
మరల శ్రీరాముని మదిలోన మెదలె
తనలక్ష్మణునిఁ బాసి క్షణమేని యిలను
మనలేని భావమ్ము మనసులోఁ దోచె.
భరతున కిల రాజ్యపట్టమ్ముఁ గట్టి
ధరణిఁ ద్యజించి తా నరుగఁ దలంచె
భరతుఁడు వేగ యావార్త నాలించి

కరుణింపుఁ డని రాముచరణమ్ము లంటె
"శ్రీరామ ! మీపాదసేవయే కాని
ఈరాజ్యభోగమ్ము లేనొల్ల" ననియె
ధాత్రిని రాముఁడే తనకు సర్వముగ
శత్రుఘ్నుఁడును వేగ చనుదెంచి నుడివె.

తిరుగులే దాతని తీవ్రభావమున
మఱుగులే దాతని మానసమ్మందు.
రాముఁడు వేగమే రాజ్యమ్ము వదలి
భూమిని వీడెడి నీమమ్ము నెఱిఁగి
వచ్చిరి బంధువుల్ వచ్చిరి మునులు
వచ్చి రమాత్యులు వచ్చిరి ప్రజలు
శ్రీరామచంద్రుని చేరి కొల్చుచును
బారులై వారిట్లు ప్రార్థించినారు.

"కార్యదక్షులు రామ ! కమనీయగుణులు
ధైర్యబలోన్నతుల్ ధర్మతత్పరులు,
వీరాధివీరులు శ్రీరామచంద్ర !
భూరిసాహసులు నీపుత్రు లిద్దఱును
వాసిగా వారికి పట్టముల్ గట్ట
కోసలప్రజలొక్క కోరిక" యనిరి.

గురువులు మంత్రులు సకలముఖ్యు లెల్ల
పరమహర్షమ్మున బాలు రిద్దఱిని,
"ప్రవిమలకీర్తితో ప్రాభవ మ్మెసఁగ
నవని నేలుఁ" డటంచు నాశీస్సు లిడిరి.

మనమున మన్నించి జనులకోర్కెను
మును యామోదమ్ము మునుముందు బడసి
సమముగా భాగించి సర్వకోసలము
సముచిత శాస్త్రోక్త సరణి రాముండు
లలితసద్గుణులైన లవకుశాఖ్యులకు
చెలువొప్ప పట్టాభిషేక మ్మొనర్చె
సురుచిర సామ్రాజ్యశోభ దలిర్ప
చెఱియొక భాగమా యిరువురి కిచ్చి,
మానితవర్తనల్ మహనీయగుణులు
జానకీరాముల సూనులు వారు,
ధీరులై పెద్దలదీవనల్ వడసి
వారివారల రాజ్యభాగమ్ము లందు
భూమినిఁ బాలింప పుణ్యకార్యముగ
ఆమోదహర్షమ్ము లంది రెల్లరును,
రాముని వంశమ్ము రాజితరీతి
భూమిని వర్ధిల్లె పొలుపు లేపారి.

---

## బంధుమిత్రులకు రాముని వీడ్కోలు

తనకార్యభారమ్ము ధరణిపై ముగిసె
తనకొఱకు వైకుంఠధామమ్ము నందు
వేగవచ్చు నటంచు వేచియున్నారు
భాగవతోత్తముల్ భక్తు లెల్లరును,
మానవవర్తన మాటవో లేక
ధ్యానమగ్నము లైన తలఁపులతోడ
బలమైన యొకదివ్య భావసమాధి
నిలిచెను రాముని నెమ్మది యెల్ల
కలఁగి రాముని యపూర్వగమనాభిలాష
ఫలమిసర్వము వారికె ప్రాజ్యమై యలరె.
చేరి బంధువుల్ స్నేహితు లెల్ల
శ్రీరాముపాదముల్ సేవించుకొఱకు,
వచ్చె సుగ్రీవుఁడున్ వానరవరులు
వచ్చెను లంకాధిపతి విభీషణుఁడు
పౌరులెల్లరు వచ్చి భక్తితో నిలచి
బారులుతీర్చి రా పట్టణమ్మందు.
అందఱు శ్రీరాము నర్చించువారె
అందఱు రాముతో నరిగెడువారె.
ఏమాట నెవ్వరి కెటుఁజెప్పవలెనో
ఆమాట శ్రీరాముఁ డరసి వచించు,

పెంచి విభీషణున్ ప్రీతితో దంకి
"నిలిపి నీధర్మంబు నీతియు పేర్మ
లాలితనగరంబు లంకాపురంబు
పాలింపు మనుచును పంపె రాముండు,
కౌంద ద్రోవిదు లమృతాంధస్సు లగుట
ఉండారు చిరకాల ముర్విపై ననియె.
తనకాళ్ళకడ భక్తితన్మయత్వమున
వినయుండై యున్నట్టి హనుమంతుఁ జూచి
చిఱునవ్వు నవ్వుచు శ్రీరాముఁ డనియె
"పరమభక్తాగ్రణీ ! పావనీ ! నీవు
వేదాంతమూర్తివి విజ్ఞానఖనివి
మేదిని తులలేని మేటివీరుఁడవు
పరమనిష్ఠాన్విత బ్రహ్మచర్యుఁడవు
పరమేష్ఠి వగుదువు భావికాలమున.
ఇలపైన నాపేరు నిలచునందాక
చెలువుగ నీవును చిరజీవివగుచు
ఆసర్వకాల మోహానుమంత నీవు
భాసురయశముతో వరలుదు" వనియె.

పౌరులన్ బంధుల పరివారములను
కూరిమితోఁ జూచి కుశలమ్ము లడిగి
చిరసౌఖ్యములుగల్గి జీవింపుఁ డనుచు

కరుణతోఁ దనశుభ కాంతులఁ దెలిపె.
మునులున్నచోటికి వినయుఁడై యేగి
మునుకొను భక్తితో మ్రొక్కి పూజించి
పరమేష్ఠిసముఁడును పరమపూజ్యుండు
ధరణిని తనకులగురువుగా నుండి
తమవంశకీర్తికి తగుశ్రేయ మొసఁగు
తమప్రాభవమునకుఁ దగుబాసటైన
మునివసిష్ఠుని పాదవనజమ్ము లంటి
వినయుఁడై సాష్టాంగప్రణతు లర్పించి
మఱునాఁడె దివికి తా నరిగెద ననుచు
నెఱిఁగించె రాముఁడు స్థిరభాషణముల.

ఆ మునిచంద్రున కాత్మలోఁ దెలియు
రాముని చిత్త మం దేమియున్నదియొ.
ఎఱిఁగించి మహాసేంద్రవరుల కీవార్త
నరగున తత్కార్యసంరంభుఁ డగుచు
రామచంద్రుని మహాప్రస్థానవిహిత
హోమాదులను సిద్ధ మొనరించె వేగ.

## శ్రీరాముడు వైకుంఠమునకు వేంచేయుట

ఉడువీథి గ్రహరాజి యుచ్చమై నిలిచి
గడియ లొక్కొక్కటి పుణ్యమ్మైఁ గడచి

ప్రవిమలమ్ముగ వచ్చె రామచంద్రుండు
భువివీడి దివికేగు పుణ్యకాలమ్ము.

ధరియించి వ్రేళుల దర్భాంకురములు
ధరియించి మేనున ధవళాంబరములు
ఆలోకనము నాసికాగ్రాన నిలిపి
నీలకేశమ్ములు వ్రేలాడ వైచి
ఆననమ్మున ధ్యానమౌనమ్ము లెసఁగ
మానితశాంతుఁడు మహితతేజస్వి
రాజగృహము వీడి రాముఁడు వెడలె
భూజను లెల్లను జేజేలు వెట్ట
భరతశత్రుఘ్నులు భార్యలతోడ
వరుసెంచి నిలిచిరి యిరుగడ లందు.

శమ దమ నియమాది సద్గుణచయము
విమలవివేకమ్ము విజయలక్ష్మియును
దాక్షిణ్యకారుణ్య ధైర్య శౌర్యమ్ము
లక్షిణ జపతప స్వాధ్యాయవిధులు
శాస్త్రాగమోజ్జ్వల సద్విశేషములు
శస్త్రాస్త్ర కౌశల చటులశక్తులును
ప్రవిమలోప నిషత్ప్రభాసార మహిమ
వివిధ పూజామంత్ర బీజమూలములు
ఏకతేజోరూప మొసఁగిన పగిది

ప్రాకటోజ్జ్వల కాంతివాహినిగాఁగ
రామునివెంబడి రమ్యోత్సవముగ
కామితాకృతులతో కదలివచ్చినవి.
సురుచిర స్త్రీరూప సుందరాకృతుల
పురలక్ష్మి యేతెంచె నరుదెంచె హ్రీయు
ఛందోఋషిన్యాససన్మంత్రప్రణవ
సౌందర్యరూపయై సావిత్రి వచ్చె.

గురువులు సచివులు పురజనుల్ మాను
లరుదెంచి రొకపెండ్లి కరిగెడురీతి
పశు పక్షి మృగ కీట ప్రాణిసంతతులు
విశదహర్షమ్మున వెంబడించినవి.
భూమిసమస్తమ్ము రామునితోడ
సామోదముగ గూడి సాగినట్లయ్యె
ఆరీతి సరయువు తీరమ్ము దరికి
శ్రీరాముఁ డల్లన చేరునప్పటికి
పరమేష్ఠి యాదిగా సురవరు లెల్ల
రరుదెంచి రట రాము నర్చించుకొఱకు.

వినవచ్చె నొకవాణి వినువీధి నంత
జనులెల్ల రాశ్చర్యచకితులై వినఁగ

"శ్రీరామ! రఘువంశ! శ్రీపరంధామ!
ధీరగుణాకార! దివ్యావతార!
సకలలోకాధార! సాధువిహార!
ప్రకటితబలసార! పాపసంహార!
చాలించి నీ మానవావతారమిలను
ఏలగా రావయ్య యెల్లలోకములు
సురుచిర వైభవ సుందరమైన
గరుడవాహన మెక్కి కదలిరావయ్య
బాగేల వైకుంఠసామ్రాజ్యమునకు
వేగరావయ్య శ్రీవిష్ణుస్వరూప!
శ్రీరామ సీతయు చేరియుపోవట
నీరాకకొరకయి నిలిచిన" దనగ
చెవుల సోకినయంత సీతనామమ్ము
ప్రవిమలహర్షాన రాముడు నుప్పొంగె,
అరుదేర తనవెంట ననుగుదమ్ములును
సరగున రాముడు సరయువుఁ జొచ్చి
ఘనతసుందరమును విశ్వమోహనము
తనదివ్యరూపమ్ము దాల్చె నమ్మదిని.

ఒక నిముసమ్ములో నున్నటులుండి
సకల దిగ్వ్యాప్తమౌ సందీప్తి తోడ
మణికిరీటమ్మును కనకచేలములు

సరయూనదీ దివ్యజలమ్ముల మునిగి
యరిగెను సుగ్రీవుఁ డర్కునిఁ జేర.
అమరశిల్పిని నలుఁ డగ్నిని నీలు
డమలాత్ములై చేరి రటులనే వేగ
ఏ దేవతాంశల నెలమి వహించి
మేదినిపై జన్మ మెత్తిరో సురల
పూనిరి వారల పూర్వరూపములు
వానరు లెల్లరా వాహిని మునిగి.

ధరణికి సంటలో సరుదెంచి నిలచె
పరమాద్భుతమ్ముగా గరుడవాహనము.
దేవత లనుచరుల్ దిక్పాలవరులు
సేవించు చిరుగడ చేరి నిల్వంగ
గరుడవాహన మెక్కి కమనీయగతుల
నరిగె నారాయణుఁ డభ్రవీథులకు.

ప్రవిమలభక్తితో దివిజు లొసర్చు
వివిధపూజావిధుల్ ప్రీతిగాఁ గొనుచు
తుములమ్ముగా దేవదుందుభుల్ మ్రోయ
విమలసుందరముగా విరివాన గురియ
పరమభాగవతులు పార్శ్వానుచరులు
సురలును దేవర్షివరులును చేరి

శ్యామలాకార ! శ్రీరామావతార ! ·
క్షేమంకరా ! సర్వజీవనాధార !
సర్వజగన్మాన్య ! సర్వశరణ్య
సర్వేశ్వరా! యని స్వాగతమ్మీయ
వాసుదేవుఁడు చేరె వైకుంఠపురము
భాసురమ్మగు తన భవ్యవాసమ్ము.
వైష్ణవీయువతులు వచ్చి హారతులు
విష్ణుకీర్తనఁ జేసి వేడ్కనీయంగ
శ్రీకాంతస్వయముగా చేయూత నిచ్చి
శ్రీకాంతుఁ జేర్చెను శేషతల్పమున.

---

## వై కుం ఠ మ హి మ

శ్రీదేవి విష్ణువు శ్రీకరాకృతులు
వేదాంతవేద్యులు విశ్వరూపులును
విశ్వకర్తలు వారు విశ్వపాలకులు
విశ్వసంరక్షకుల్ విశ్వాత్మకులును.
లోకకళ్యాణైక లోలాత్ములమల
వైకుంఠవాసులు వాత్సల్యనిధులు.

పూర్ణసౌందర్యమ్ము పుణ్యధుర్యమ్ము
వర్ణనాతీత మావైకుంఠమహిమ.
సత్యమ్ము శాంతమ్ము సత్వాతిశయము

నిత్యమ్ము నిగూఢ మ్మత్యంతవిశద
మునిజనాహ్లాద మహాధ్యాత్మికమ్ము
మోక్షసాధనము ముముక్షు శ్రేయమ్ము
భాగవతోత్తము భవ్యజనస్థులకు
ఆగమవేత్తల కాశ్రయ మ్మదియె.

---

## ఫలశ్రుతి

పరమేష్ఠి భారతి, భర్గుండు పార్వతియు,
సురలును సురమును లరుదెంచి యటను,
విష్ణుని చరితమ్ము విష్ణుని మహిమ
విష్ణునిలీలలు వేడ్క కీర్తించి
"సర్వచరాచర జగతి కెల్లెడల
సర్వసౌఖ్యములిచ్చి సంతోష మిచ్చి
నీ సత్కృపాశక్తి నిత్యమై యలరి"
భాసిల్లుగాకంచు వాంఛించి చనిరి.
జానకీరాముల చరితమ్ము నందు
మానితోత్తరభాగ మహిత మీగాథ,
సమధిక మాధుర్య సాహిత్య సార
రమణీయ ముత్తర రామాయణమ్ము
చదివిన వినినను జనుల కెల్లరకు
సదమలోన్నతభాగ్య సంపత్కరమ్ము.

# గద్యము

శ్రీ భారతీ కరుణాకటాక్షలబ్ధ కవితావిశేష హారితసగోత్ర
పవిత్ర రత్నమాంబ సర్రాజార్యపుత్ర కవిశేఖర
కవిభూషణ బిరుదాంచిత సజ్జనవిధేయ సుబ్బారాయ
నామధేయ ప్రణీతంబైన శ్రీఉత్తరరామాయణకథ
సర్వము సంపూర్ణము

ఓమ్ తత్ సత్.